# ఆంధ్రపత్రిక



THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 42. సంచిక 178 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO బుధవారం 28-9-1955 Reg. No. M. 1118 6 పేజీలు 1 అణా

# 16 తెలుగు - తమిళ తాలూకాలలోనే జనాభా లెక్కల సేకరణ

## ఒరిస్సా మైసూరు సరిహద్దులు తర్వాత చూసుకోవచ్చునని ముఖ్యమంత్రి

కేంద్ర విద్యామంత్రి మౌలానా అబుల్ కలాం ఆజాద్, పురావస్తు పరిశోధకశాఖ సలహా సంఘ వార్షిక సమావేశంలో అధ్యక్షోపన్యాసం చేశారు. ఈ సంఘం సెప్టెంబరు 1 న పునర్నిర్మించబడింది.

## సూళ్లూరుపేట జనాభా లెక్కలు కూడా ఎందుకని సభ్యుల ఆశ్చర్యం

## ఆంధ్ర మద్రాసు ప్రభుత్వాలకు ఇంకా ఒడంబడిక కుదరలేదు

కర్నూలు, సెప్టెంబరు 27 : మద్రాసు సరిహద్దు ప్రాంతాల సమస్యను పరిష్కరించుకొనేందుకు గాను అయిదు జిల్లాలలోని 16 తాలూకాలలో భాషవారీ జనాభా లెక్కలు సేకరించటమయిందనీ, ఈ సందర్భంలో మద్రాసు ప్రభుత్వం కొన్ని సూచనలు చేయటము, అందుకు బదులుగా ఆంధ్ర ప్రభుత్వము మరికొన్ని సూచనలు చేయటము జరిగిందనీ, అంతకుమించి ఉభయ ప్రభుత్వాలకూ ఒడంబడిక ఏమీ జరగలేదనీ ముఖ్యమంత్రి చెప్పారు.

ఒరిస్సా, మైసూరు రాష్ట్రాలతో గల సరిహద్దు తగాదాలను ఒకటొకటిగా తర్వాత పరిష్కరించుకోవటము మంచిదన్నారు.

ఈ జిల్లాలలో లెక్కలు సేకరించారు :

చిత్తూరుజిల్లా:-కాళహస్తి, పుత్తూరు, తిరుత్తని, చంద్రగిరి, పలమనేరు, చిత్తూరు.

చెంగల్పట్టుజిల్లా:-పొన్నేరి, తిరువళ్ళూరు, సైదాపేట.

ఉత్తరార్కాడుజిల్లా:-ఆర్కోణం, గుడియాత్తం, వాలాజాపేట, తిరుపత్తూరు.

సేలంజిల్లా:-హోసూరు, కృష్ణగిరి.

నెల్లూరుజిల్లా:-సూళ్ళూరుపేట.

ఈ తగాదాల విషయంలో ముఖ్యంగా పెట్టుకోవలసింది వీటిని పరిష్కరించుకోవాలనే వుద్దేశము కాని క్లిష్టపరిస్థితిని కలిగించాలనేది కాదని కూడా ఆయన అన్నారు.

శాసనసభ సమావేశం నేడు ఉదయం శ్రీ ఆర్. ఎల్. ఎన్. దొర అధ్యక్షతను ప్రారంభం కావటంతోనే శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య ఈ విషయమై ప్రశ్న వేశారు.

ముఖ్యమంత్రి ప్రత్యుత్తరమిస్తూ ఈ పై జిల్లాలలోని ఆయా గ్రామాలలో ఎందరెందరు ఏయే భాషలు మాట్లాడే వారున్నారో లెక్కలు సేకరించటమయిందన్నారు.

### త్వరలో వివరాల ప్రకటన

ఈ లెక్కల సేకరణకు 1951- జనాభా లెక్కలను ఆధారం చేసుకొన్నారనీ, ఈ వివరాలతో త్వరలోనే ఒక చిరుపుస్తకం ప్రచురిస్తారనీ కూడా చెప్పారు.

శ్రీ సుందరయ్య : ఈ వివరాలు ఎంత త్వరలో ప్రచురిస్తారు? రాష్ట్రపునర్వ్యవస్థీకరణ సంఘం నివేదిక వచ్చేలోపున ప్రచురిస్తారా?

ముఖ్యమంత్రి : త్వరలోనే ప్రచురణ చేస్తాము.

ప్రశ్న : మీరు ప్రచురించటం ఆలస్యమయినా మీరు సేకరించిన లెక్కలు మమ్మల్లను చూడనిస్తారా?

జవాబు: కావాలిస్తే శ్రీ వెంకట్రావు వద్దకు వెళ్లి చూడవచ్చు.

శ్రీ ఆర్. బి. రామకృష్ణంరాజు: 1931 జనాభా లెక్కలు ప్రకారము ఏయే గ్రామములో ఎంతమంది ఏ భాష వారు వున్నారో లెక్క తీశారా?

జవాబు: 1951-జనాభా లెక్కల ప్రకారం తయారు చేశారు.

### 1951లో అక్రమాలు జరిగినాయి

శ్రీ కాశీశ్వరరావు: 1951-లో

4 వ పేజీ చూడుడు

## కాశ్మీర్ సమస్యా పరిష్కారం

### భారత పాకిస్థాన్‌లే సాధించాలని హితవు

ఢక్కా, సెప్టెంబర్ 27 : కాశ్మీర్ సమస్యను భారత పాకిస్థాన్‌లు తమకు తామే పరిష్కరించుకోవాలి అని ఈజిప్టు ఉపప్రధాని జమాల్ సలాం సూచించారు.

నేడాయన కరాచీనుంచి నాలుగు రోజులు తూర్పు బెంగాల్‌లో గడిపేందుకు ఇక్కడికి వచ్చారు. రాగానే విలేఖరులు కాశ్మీర్ తగాదామీద అభిప్రాయం అడగ్గా ఈమాట చెప్పారు.

"మమ్మల్ని మధ్యవర్తిత్వం జరపవలసిందిగా ఎవ్వరూ కోరనంతవరకూ ఆ తగాదా విషయమై మేము ఏమీ చెప్పలేము." అని ఆయన అన్నారు.

భారత పాకిస్థాన్‌ల సంబంధాలమీద మీ అభిప్రాయం ఏమిటి అని అడగ్గా, ఆ అంశంమీద తాను వ్యాఖ్యానం చేయదలచలేదని ఈజిప్టు ఉపప్రధాని అన్నారు.

## ఈజిప్టుకు ఆయుధాలు

### అమ్మడానికి అమెరికా సమ్మతి

వాషింగ్టన్, సెప్టెంబరు 26 : ఒక నిర్ణీత మొత్తంలో ఆయుధాలకు రొక్కం చెల్లించే పద్ధతిమీద ఈజిప్టుకు అమ్మటానికి అమెరికా అంగీకరించింది.

అమెరికా విదేశాంగ కార్యాలయో ద్యోగి ఒకరు నేడీ అంశాన్ని వెల్లడిస్తూ అయితే దీనికి కావలసిన డబ్బును సమకూర్చేందుకు అమెరికా ఇతర ఏర్పాట్లేమీ చేయలేదనీ, అందువల్ల ఇంతవరకూ కొనుగోలేమీ జరగలేదనీ వివరించారు.

సోవియట్ యూనియన్ ఈజిప్టుకు ఆయుధాలు సప్లయి చేస్తానని చెప్పినందువల్ల అమెరికా తానుకూడా ఆయుధాలు సప్లయి చేస్తానని చెప్పిందని పత్రికల్లో వార్తలు వచ్చినవి. వాటిమీద వ్యాఖ్యానిస్తూ ఆ ఉద్యోగి ఇట్లా రొక్కం చెల్లించే పద్ధతిమీద ఆయుధాలు సప్లయి చేయటానికి అంగీకరిస్తూ అనేక పశ్చిమ ఆసియా దేశాలతో తాము ఒప్పందం చేసుకున్నామని వెల్లడించారు.

## పూరీ జిల్లాలో 13 మంది మరణం

### తుపాను, వరద ఫలితం

కటక్, సెప్టెంబరు 26: ఒరిస్సాలో తుపానులవల్ల వరదలులో మూలంగాను పూరీజిల్లాలో 13 మంది ప్రాణాలు కోల్పోయారు. ఎన్నో ఇళ్లు కొట్టుకు పోయినాయి.

ఈ జిల్లాలో నయాఘర్ ప్రాంతం గట్టిగా దెబ్బతిన్నది. వందల ఎకరాల పంట జలమయమై పోయింది. రవాణా మార్గాలు చెడిపోయినాయి. చిల్కా సరస్సు పొంగి ప్రక్క గ్రామాలను ముంచివేసింది.

నయాఘర్ ప్రాంతంలో 80 గ్రామాలకుపైగా దెబ్బతిన్నాయి. ... నది పొంగి ఈ గ్రామాలను పాడు చేసింది.

## భారత చేనేత వస్త్రాలకు అమెరికాలో గిరాకీ

### రుమాళ్లు లుంగీలు అద్దకం గుడ్డలపై మోజు

బొంబాయి, సెప్టెంబరు 26 : అమెరికాలో బట్టల వర్తకులు భారత దేశపు చేనేత వస్త్రాలు కొనడానికి కుతూహలం చూపుతున్నారు. త్వరలోనే ఒక పెద్ద వస్త్ర వ్యాపారసంస్థ కనీసం 10 లక్షల గజాల చేనేత వస్త్రాన్ని తయారుచేసి ఇమ్మని అడగనున్నట్లు తెలుస్తున్నది.

అమెరికా వస్త్రవ్యాపార ప్రతినిధులు వచ్చే నెలలో ఇక్కడకు రానుంటారనికూడా తెలుస్తున్నది.

ఈసంస్థగాక, ఇంకా అమెరికాలో చిల్లర వ్యాపారం చేస్తూవుండే అనేక సంస్థలు చేనేత వస్త్రాలను గురించి వాకబు చేస్తున్నట్లు, కుదిరితే పెద్దఎత్తున వ్యాపారం చేయాలని వున్నదని, ఇచ్చిన నమూనాల ప్రకారం, సకాలంలో సరుకును అందించగలరేమో, తేదీ చెప్పవలసిందని అడుగుతున్నారనికూడా తెలియవస్తున్నది.

న్యూయార్కులో వున్న భారత ప్రతినిధి కార్యాలయంలో ఈ చేనేత వస్త్రాల రకాలను ప్రదర్శిస్తున్నారు. ఇప్పటికి ఆరునెలలనుంచి ఈ ప్రదర్శనం జరుగుతున్నది. దీనిని అమెరికన్లు చాలా శ్రద్ధతో చూస్తున్నారు. ఈ వస్త్రాలంటే అక్కడ మోజు కలిగింది.

ఈ కారణాలను, అవకాశాలను పురస్కరించుకొని భారత చేనేత బోర్డు నేడు వివిధరాష్ట్రాలలోని రాష్ట్ర సహకారసంఘాల ప్రతినిధులను కలుసుకొని, అమెరికావారు కావలసినరకం వస్త్రాలు ఉత్పత్తిచేయగలరేమో చూస్తారు.

ఈ సంఘాలన్నీ ఈ పనిని తేలికగా నిర్వహించగలవని భావిస్తున్నట్లు తెలుస్తున్నది. అయితే వ్యాపారం మధ్యలో ఆగకుండా ఏర్పాటు వుంటే, ఈ పనిని తాము నిర్వహించగలమని ఈ ప్రతినిధులు చెప్పినట్లు కూడా తెలియవస్తున్నది.

అమెరికన్లు ఈ రకాల వస్త్రాలను కోరుతున్నారు. (1) మద్రాసు చేతి రుమాళ్లు, (2) లుంగీ గుడ్డలు, (3) ప్రింటులు (అద్దకం), (4) బెనారస్ పీటలు.

## పాక్ మంత్రివర్గ విస్తరణ

### నిమ్నజాతి ప్రతినిధికి స్థానం

కరాచీ, సెప్టెం 26 : యునైటెడ్ ఫ్రంట్ ప్రతినిధి హమీదుల్ హక్ చౌదరి, నిమ్నజాతి ప్రతినిధి ఎ. కె. దాస్ నేడు పాకిస్థాన్ మంత్రులుగా పదవీస్వీకార ప్రమాణం చేశారు. వీరికి ఏ శాఖలిచ్చేదీ ప్రకటన కాలేదు. వీరితో కలిసి మంత్రివర్గం సంఖ్య 13 అయింది.

ఈ ఇద్దరూ తూర్పు పాకిస్థాన్‌వారే. హమీదుల్ హక్ చౌదరి తూర్పు పాకిస్థాన్‌లో వాణిజ్య పరిశ్రమల మంత్రిగా ఉండేవారు. మొట్టమొదటి పాకిస్థాన్ ప్రభుత్వంలో ఉన్న జోగేంద్రనాథ మండల్ తరవాతి అందులో స్థానం ఇవ్వబడ్డ మొదటి నిమ్నజాతి ప్రతినిధి ఎ. కె. దాస్.

## శాంతియుత పద్ధతులలో సామాజిక ఆర్థిక విప్లవం

### కాంగ్రెసు ఆశయం: ప్రజలు అర్థంచేసుకొని తోడ్పడాలని శ్రీ ఢేబర్ ప్రబోధం

అలహాబాద్, సెప్టెంబరు 26 : సర్వజనుల సహాయంతో, శాంతియుత పద్ధతులద్వారా సాంఘికార్థిక రంగాలలో విప్లవం కొనిరావటమే కాంగ్రెసు లక్ష్యమని కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ యు. ఎన్. ఢేబర్ అన్నారు.

బహిరంగ సభలో ఉపన్యసిస్తూ సామ్యవాదం సరళి సమాజ స్థాపనకు తోడి అడుగు పంచవర్ష ప్రణాళికలనీ, వీటిని అమలు జరపటానికి ప్రజలందరూ తోడ్పడాలనీ, ప్రణాళికల ఘనతను వాటికయే డబ్బునుబట్టికాక, అవిసమాజంలో తీసుకు రాగల మార్పునుబట్టి గణించాలనీ ఆయనన్నారు.

దేశం స్వాతంత్ర్యం అయినమాట నిజమే. కాని ఇంకా ప్రజలలో నూటికి ఎనభైమంది రెక్కాడితే కాని డొక్కాడని పరిస్థితిలో ఉన్నారు. మిగతావారు వీరిశ్రమఫలాన్ని అనుభవిస్తున్నారు. ఈ అసంగతి పరిస్థితిని తొలగించాలి.

### దొంగపత్తులు కావు

కాంగ్రెసు పెట్టుబడిదారీ పక్షమనీ, సామ్యవాద సరళిసమాజ స్థాపన అనేది ఆ పక్షం ఎన్నికలనిమిత్తం వేసిన ఎత్తుఅనీ కమ్యూనిస్టులూ, ప్రజా సోషలిస్టు పార్టీవారూ అంటూ వుంటారు. అదేకనక నిజమయితే జమీందారీల రద్దు, భారత సంస్థానాల విలీనం జరిగేవా? కాంగ్రెస్‌కు ఎత్తులపిచ్చి ఎన్నడూ లేదనేది ప్రజలకు తెలిసిందే.

మనం మొదటి పంచవర్ష ప్రణాళికను పూర్తిచేసుకొని రెండోది ప్రారంభించ బోతున్నాము. దానికి సుమారు 6000 కోట్ల రూపాయలు వెచ్చించ బోతున్నాము. దానితో దేశం రూపురేఖలు ఎంతో మార్పు చెందాలని ఆశిస్తున్నాము. ఈఆశ ఫలించాలంటే ప్రజలంతా ఈకార్య భారమంతా తమకే, తమ పురోభివృద్ధికేనన్నది గ్రహించి సంపూర్ణ సహకారం చేయాలి అని శ్రీ ఢేబర్ అన్నారు.

### ఐకమత్యబలం

ఇంతకుముందు రక్షణ మంత్రి డాక్టర్ కె. ఎన్. కట్జు దేశంలో ఈనాడు అన్నిటికంటే ముఖ్యమయింది ఐక్యమత్యం అన్నారు. రక్షణ బలగాలలో వివిధ ప్రాంతాల నుంచి వచ్చినవారు ఎక్కువ ఐకమత్యంతో వుంటారనీ, వారి ఏకైక లక్ష్యం దేశానికి సేవచేయుటమే ననీ ఆదేభావం ప్రజలందరిలోనూ కలిగిననాడు సామ్యవాద సరళిని సత్యసమాజ స్థాపన సులభమవుతుందనీ అన్నారు.

పట్టణ కాంగ్రెసు శ్రీ ఢేబర్‌కు రు. 1011 బహూకరించారు.

శ్రీ ఢేబర్ తర్వాత విద్యార్థుల సభలో మాట్లాడుతూ భవిష్యద్భారతానికి వారే ముఖ్యాధారమనీ, వారు విద్య నభ్యసించటమే కాక దేశపరిపాలనా బాధ్యతలను వహించటానికి సన్నద్ధులు కావాలనీ అన్నారు.

పత్రికా రచయితల సభలో ప్రసంగిస్తూ, వారు ట్రేడ్ యూనియనులుగా ఏర్పడటం మంచిదా కాదా అన్నది అఖిలభారత కాంగ్రెసు సంఘం ఆలోచిస్తున్నదనీ, ఇందుకు అనుకూలురూ ప్రతికూలురూ కూడా తమతమ అభిప్రాయాలు నిశదీకరిస్తూ విజ్ఞప్తికలు పంపవలసిందనీ అన్నారు. కాంగ్రెసు ప్రెస్ కమీషన్ నివేదికను ఇంచుమించుగా ఆమోదించిందన్నారు.

## సాయుధ బలగాలున్న దేశాల మధ్య సత్యాగ్రహం వీలులేదు

### గోవా సమస్యపై వినోబాజీ అభిప్రాయం

కటకం, సెప్టెంబరు 26: సాయుధబలగాలువున్న రెండుదేశాల మధ్య వ్యవహారంలో ఒకదేశస్థులు రెండవ దేశానికి వ్యతిరేకంగా సత్యాగ్రహం గానీ, అహింసా చర్యగానీ జరపరాదనీ, వారికావిధమైన నైతిక హక్కు లేదనీ, తమ దేశానికి సేనలేనప్పుడే వారాపని చేయవచ్చునని ఆచార్య వినోబా భావే అభిప్రాయ పడినారట.

ఈ కారణంవల్లనే వినోబాజీ గోవాలో భారతీయులు సత్యాగ్రహం జరపటానికి అయిష్టం తెలిపారనీ, అఖిల భారత కాంగ్రెసు సంఘం ఈ విషయమై చేసిన తీర్మానాన్ని ఆయన ఆమోదించారనీ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ శ్రీమన్నారాయణ్ తెలియజేశారు.

శ్రీ శ్రీమన్నారాయణ్ నిన్న మొన్న ఆచార్య భావేతో సంప్రతింపులు సాగించారు.

సర్వసేవా సంఘం అధ్యక్షత సర్వోదయ సిద్ధాంతాల ననుసరించి కోరాపుట్టి జిల్లాలోని 2500 గ్రామాలలో 'తీవ్రాభివృద్ధి కార్యక్రమం' అమలు జరుగుతుందనీ, దీనికి ప్రధాని శ్రీ నెహ్రూ, కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ఢేబర్ ఆమోదించారనీ కాంగ్రెసు కార్యదర్శి అన్నారు.

ఈ కార్యక్రమ నిర్వహణకు ప్లానింగు కమీషను, ప్రభుత్వము పూర్తిగా తోడ్పడతాయని కూడా ఆయన అన్నారు.

## రక్షణ వ్యవహారాలపై టర్కీ పర్షియా సంప్రదింపులు

### టెహరాన్‌లో బయార్ ప్రకటన

టెహరాన్, సెప్టెంబర్ 26: తాను పర్షియాలో గడిపిన సమయంలో రక్షణ వ్యవహారాలను గురించి పర్షియారాజుతోనూ, ప్రభుత్వనాయకులతోనూ సంప్రదింపులు జరిపినట్లు టర్కీ అధ్యక్షుడు సలాల్‌బయార్ విలేఖరుల గోష్ఠిలో వెల్లడించారు.

టర్కీ - ఇరాక్ ఒప్పందంలో పర్షియా చేరటం ఉభయులకూ లాభమని తాము అనుకుంటున్నామనీ, అయితే అందులో చేరవలసిందిగా పర్షియాను ప్రత్యేకించి కోరలేదనీ ఆయన తెలియజేశారు. అయినా ఈ విషయంలో పర్షియా నిర్ణయానికి తాము ఎదురుచూస్తున్నామనికూడా ఆయన తెలియజేశారు.

పర్షియా పర్యటన ముగించుకుని అంకోరా తిరిగివెడుతూ ఆయన యీ విషయాలు తెలియజేశారు. టర్కీ అధ్యక్షుడు పర్షియారాజును టర్కీ రావలసిందిగా ఆహ్వానించారు.

పర్షియా, టర్కీలమధ్య రైలు, రోడ్డు విమాన, టెలిగ్రాఫ్ సౌకర్యాలను పెంపొందించే విషయాన్ని గురించి, వాణిజ్య ఒప్పందం చేసుకునే అంశంమీదనూ ఉభయ ప్రభుత్వనాయకులు సంపాదించారని నేటి ఉదయం ఒక సంయుక్త ప్రకటనలో వెల్లడించబడ్డది. ఈ విషయమై చర్యలు తీసుకునేందుకు సమిష్టి సంఘం ఒకటి నెలకొల్పబడుగుందని ఆ ప్రకటన తెలియజేసింది.

మధ్యప్రాచ్య ఆసియా దేశాల పటిష్ఠసన్నాహాలవల్ల వాటిమీద సోవియట్ ఒత్తిడి తగ్గిపోయిందని ప్రెసిడెంట్ బయార్ విలేఖరులతో అన్నారు.

## ఆగ్నేయాసియా ఒప్పందం

### సంయుక్త సైన్యాధిపత్యం లేదట

కరాచీ, సెప్టెంబర్ 26 : ఆగ్నేయాసియా రక్షణ ఒప్పందం దేశాలకు కలిపి సంయుక్త సైన్యాధిపత్యాన్ని నెలకొల్పే ఆలోచన ప్రస్తుతం లేదని పాకిస్థాన్ విదేశాంగ కార్యాలయోద్యోగి ఒకరు నేడిక్కడ వెల్లడించారు. ఈ ప్రాంతాలను ఇటువంటి సైన్యాధిపత్యం ఏర్పాటు కావాలన్న సిన్ని ... ఆయన వ్యాఖ్యానిస్తూ ప్రస్తుతం ప్రతిపాదన ఏమీ లేదనీ, అయితే ఒకమంత్రి ఏర్పాటే అవకాశాన్ని మాత్రంతో విడదీయ వీలు లేదనీ అన్నారు.

## దేశపునర్నిర్మాణానికి సాధువుల కృషి

బరోడా, సెప్టెంబరు 26 : దేశ పునర్నిర్మాణానికై జరుగుతున్న మహాయజ్ఞం' జయప్రదం అయేటట్లు చేయటానికి సంసార జంజాటం వదిలివేసిన సాధువులు కూడా పూనుకొన్నారు.

మధ్యప్రదేశ్‌కు చెందిన సంత్ తుకడోజీ మహారాజ్ ఇందునిమిత్తం 80 లక్షల సాధువులను సమీకరించ సంకల్పించారు. ప్రస్తుతం ఈయన ఈపనికై గుజరాత్‌లో పర్యటిస్తున్నారు.

ప్రతిప్రాంతంలోనూ గల సాధువులను సమీకరించి సంఘాలు ఏర్పరచి, ఆసంఘాలు ప్రజల సాంఘికార్థిక స్థితిగతుల అభివృద్ధికి కృషిచేసేటట్లు చేస్తామని ఆయన అన్నారు. మానవసేవ మాధవసేవ అని తాము నమ్ముతామనీ, దానిని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నిస్తున్నామనీ ఆయన అన్నారు.

ఈవిషయమై తాము రాష్ట్రపతి, ప్రధాన మంత్రి ప్రభృతి పెద్దలకు తెలియచేసి, వారి ఆశీర్వాదంతో నే ఇందుకు పూనుకొన్నారని కూడా సంత్ తుకడోజీ మహారాజ్ అన్నారు.

కాశ్మీరులో చేతితో తయారుచేసిన దీపపుకుండ. దీనిపైనున్న షేడ్ కాగితంతో తయారుచేయబడింది.

## పారాలో ముప్పులు

### ఫ్రెంచివారి దుస్థితి

పారిస్, సెప్టెంబరు26: ఫ్రాన్సు ప్రజలు అంతకంతకే మితిమీరి సారాయి త్రాగి ప్రాణాలు పోగొట్టుకుంటున్నారని ఫ్రెంచి గణాంక సేకరణ సంస్థ నేడు వెల్లడించింది. 1953 లో మితిమీరిన మద్యపానం వల్ల 3905 మంది మరణించగా, 1954 లో 4106 మంది మరణించారట.

## తుపాన్‌లో ఇరోజిమా దీవి ధ్వంసం

టోక్యో, సెప్టెంబర్ 26 : పసిఫిక్‌లో ఇప్పుడు విజృంభించిన ఒక తుపాన్ వల్ల ఇరోజిమా దీవి ఇంచుమించుగా సర్వనాశనం అయిపోయిందని వార్తలు వచ్చినవి. భవనాలు, గిడ్డంగులు, అమెరికన్ వైమానిక స్థావర భవనాలు నాశనమయి పోయినవి.

తుపాను నేటిరాత్రి జపాన్ మీదికి వస్తున్నది. ఇందులో నడిమి భాగంలో గాలివేగం గంటకు 140 మైళ్ళదాకా వున్నదట.

## భారత ప్రభుత్వము

ఆహార, వ్యవసాయశాఖ

RDF/SPL/TR (37).

రీజనల్ డైరెక్టరు (ఆహారం) భారత ప్రభుత్వము, కలకత్తా, వారు, కలకత్తాలోని సెంట్రల్ రిజర్వులో ఉన్న నిల్వలనుండి 2,000 టన్నుల బర్మా గుండి బియ్యము, 4,000 టన్నుల బెంగాల్ సాధారణ ధాన్యము, 880 టన్నుల బెంగాల్ సన్న ధాన్యము, 1,640 టన్నుల బెంగాల్ మేలిరకం ధాన్యమును సీలు వేసిన టెండరులను కోరుచున్నారు. షరతులు నిబంధనలు గల నిర్ణయించిన ఫారములలో 10-10-55 తేదీ మ. 11 గంటలలోగా టెండరులు పైవారికి చేరవలెను. టెండరు ఫారములు 8, ఎస్ప్లనేడ్ ఈస్టు, కలకత్తాలోని వారి ఆఫీసునుండి ఫారమునకు రు. 2/- చెల్లించి పొందవలెను. ఒక బస్తాలపోగులో (20-40 టన్నులు) కు తక్కువ లేకుండా టెండరుదారులు పేర్కొనవచ్చును.

AC-501 (61).

## భారత ప్రభుత్వము

ఆహార, వ్యవసాయశాఖ

టెండరు నెం: "XVII"

బియ్యము/ధాన్యం

20042/55/ P-I (XVII) (.)- మద్రాసు, ఆంధ్ర, మైసూరు, తిరువాన్కూరు-కొచ్చిన్ రాష్ట్రములలోని సెంట్రల్ రిజర్వు గోడవునులలో ఉన్న క్రింద వివరించిన ప్రకారం బియ్యము, ధాన్యము కొనువారలనుండి సీలు వేసిన టెండరులను రీజనల్ డైరెక్టర్ (ఫుడ్) భారతప్రభుత్వము, మద్రాసు, వారు కోరుచున్నారు.

| | టన్నులు |
|---|---|
| మద్రాసు సిటీ | 500 |
| కారూర్ | 400 |
| కాంచీపురం | 700 |
| ఉత్తర ఆర్కాటుజిల్లా | 650 |
| ఈరోడు | 550 |
| కోజికోడ్ | 600 |
| పాల్ఘాట్ | 500 |
| మైసూరు | 1000 |
| అలెప్పీ | 1000 |
| క్విలన్ | 500 |
| మట్టంచేరి | 6000 |
| తిరుచూరు | 500 |
| తిరువేంద్రం | 500 |
| కోయంబత్తూరు | 2350 |
| కడలూరు | 1750 |
| నాగపట్నం | 800 |
| టూటికొరన్ | 400 |

స్మాల్ కాజస్ కోర్టు, బెంగుళూరు.

S. C. No. 710/1955.

వాదులు: M/s. సైకి సప్లయీస్ లిమిటెడ్., బెంగుళూరు.

ప్రతివాదులు: M/s మురుగన్ టాకీస్ వారి పార్ట్నర్సులో ఒకరైన శ్రీ పి.ఎం. చక్రపాణినాయుడు, పుత్తూరు, చిత్తూరు ...

## కాసినో

కన్యాశుల్కము (తెలుగు)

## 'భవన నిర్మాణాల్లో లోపాల కారణాలను విచారించాలి'

## కర్నూలు అభివృద్ధికి సక్రమ చర్యలు తీసుకోనాలని పౌరసభ అభ్యర్థన

కర్నూలు, సెప్టెంబరు 26: కర్నూలులో ప్రభుత్వం కొత్తగా కట్టించిన భవనాల లోపాలను విచారించడానికి నిష్పాక్షిక సంఘాన్ని నియమించాలనీ, ఇంతవరకూ జరిగిన అభివృద్ధి కార్యక్రమాలలో కనిపించిన లోపాలకు కారకులైన వారిపై చర్యతీసుకోవాలనీ ప్రభుత్వాన్ని కోరుతూ నిన్న సాయంకాలం కొండారెడ్డి బురుజువద్ద జరిగిన సభలో తీర్మానాలు చేశారు.

పట్టణ కాంగ్రెసు ఆధ్వర్యాన జరిగిన ఈ సభకు శ్రీ టి. సి. వెంకటప్ప అధ్యక్షత వహించారు.

పురపాలకసంఘ వ్యవహారాలను అభ్యుదయ పంథాలో నడిపించడానికి తగు చర్యతీసుకోవలసిందిగానూ, నిస్తబ్ధంగా ఉన్న పట్టణాభివృద్ధి సంఘాన్ని పునర్నిర్మించవలసిందిగా కూడా ద్యా సభలో తీర్మానాలు చేశారు. దండిపల్లి వెంకటసుబ్బశాస్త్రిగారు ప్రతిపాదించిన ఈ తీర్మానాలను సభలో ఏకగ్రీవంగా ఆమోదించారు.

అధ్యక్షులు మాట్లాడుతూ పట్టణంలోని పారిశుద్ధ్య సౌకర్యాలేమీ బాగా లేవనీ, పురపరిపాలన, ఆరోగ్యసౌకర్యాలను అభివృద్ధి చెయ్యాలనీ అన్నారు.

### విచారణ అవసరం

పట్టణ కాంగ్రెసు కార్యదర్శి శ్రీ ఎస్. ఎస్. గుప్త ఇట్లా అన్నారు: "ప్రభుత్వ ప్రధాన కేంద్రం పేరట ఈ పట్టణంలో కోట్లకొలదిడబ్బు ఖర్చించారు. ప్రకాశంనగర్ లో భవనాలు కూలిపోవడానికి సిద్ధంగా ఉన్నవని అందరికీ తెలుసు. ...

... న్నవో చూడవలసిన బాధ్యత, మార్కెటు కని కొత్తగా కట్టిన కొట్లు ఎట్లా ఉన్నవో చూడవలసిన బాధ్యత ఇంజనీరింగ్ శాఖపై లేదా? ఇప్పటికైనా ప్రభుత్వం మేల్కొని పరిస్థితులను బాగు చెయ్యాలని కోరుతున్నాను."

సర్దారవారిని ఎన్నుకుంటే ప్రజలకు ఇటువంటి తిప్పలు రావనీ గతి జలసేతు బంధనసంకంటే ముందు కర్తవ్యం ఆలోచించాలనీ సర్దార్ నాగప్ప గారు అన్నారు.

అటు తరువాత శ్రీ దండిపల్లి వెంకటసుబ్బశాస్త్రిగారు మాట్లాడుతూ ఇటా అన్నారు. "నేను కోట్లు అడిగడానికి వచ్చినవారిని కాను. పట్టణ పరిస్థితులు బాధ కలిగించగా, ప్రజా శ్రేయస్సు దృష్ట్యా ప్రభుత్వం కర్తవ్యాన్ని నెరవేర్చాలని మీతోపాటు ప్రభుత్వానికి చెప్పడానికి వచ్చాను. పురపారిశుద్ధ్య వ్యవహారంలోనూ, ప్రభుత్వోద్యోగుల భవనాల నిర్మాణంలోనూ జరిగిన, జరుగుతున్న అక్రమాలను "ఆంధ్రపత్రిక" బయటపెట్టినందున ...

### అసంతృప్తి

### ప్రభుత్వమే సాక్షి

## ఈశాన్య సరిహద్దు ప్రాంత అభివృద్ధి

### ద్వితీయ ప్రణాళికలో రూ 1050 లక్షల ఖర్చు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 26: ఈశాన్య సరిహద్దు ప్రాంతాల అభివృద్ధికోసం, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 10 కోట 50లక్షలరూ.లు ఖర్చుచేయ సంకల్పించినట్లు తెలియవచ్చింది. ఆ ప్రాంతాల పరిపాలనాధికారులు ఇక్కడికి వచ్చి ప్లానింగు కమీషన్‌తో సంప్రతింపులు పూర్తిచేసుకొని ప్రణాళికను ఖరారుచేసుకొన్నారు.

## పాకనుంచి వచ్చిన హిందువులు ఎక్కువ

### భారత దేశం నుంచి వెళ్లిన ముస్లింల కంటె

## రాజభవన వార్తలు

## మదరాసు ధరలు

## న్యూయార్కు దూది

## నెల్లూరు జిల్లాలో భూదానం

## నందికొండ ప్రాంత బంజర్లు

## ఆకాశవాణి

గురువారం సెప్టెంబరు 29

విజయవాడ

ఉ॥ 6 50 స్వాగతం. 6-55 ప్రసార విశేషాలు 7-0 తెలుగు వా. 7-15 నగరాసు వి వలె. 7-30 మద్రాసు వలె. 8-0 అంగ్ల వార్తలు.

మ॥ 1-0 వి వలె. 1-30 ఎ వలె. 1-40 హిందీ వా. 1-50 తెలుగు వా. 4-0 వాద్యసంగీతం (రి.)

సా॥ 5-30 వి. వి. నీలారాయ్-వీణ 6-0 సంగీత శిక్షణ 6-15 ప్రాంతీయ వా. 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామస్థుల కార్యక్రమం. 7-0 తెలుగు వా. 7-15 గీత వలీ-కె. వి. కామరాజు 7-30 ప్రజా క్షేమము. ఆరోగ్య రక్షణ (ప్రసంగం.) కళా వెంకటరావు (మదరాసు నుండి రిలే) 7-45 గానమంజరి (రి) 8-0 ఆంధ్రదేశపు జానపదగీతాలు (మదరాసు నుండి రిలే) 8-15 అపురూప కీర్తనలు. నిలయవిద్వాంసులు 8-50 వి. వి. నీలారాయ్-వీణ 9-0 ఆంగ్లవార్తలు. 9-15 గీత వలీ-కె. వి. కామరాజు 9-30 గానసుధ (రి) 10-0 ప్రసారసమాప్తి.

మద్రాస్ (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళముల వా॥ 7-30 ఎస్. వి. సౌందరరాజన్ 8 ఆంగ్లముల వార్తలు.

## క్రీడారంగం

## యూనివర్సిటీల ఫుట్‌బాల్

### ఉస్మానియా ఉత్కళ్ పోటీ మధ్యలో ఆపుదల

హైదరాబాదు, సెప్టెంబరు 26: నిన్న ఇక్కడి ఫతే మైదాన్‌లో ప్రారంభమయిన సౌత్ జోన్ యూనివర్సిటీల ఫుట్‌బాల్ పోటీలలో నేడు ఉత్కళ్ గత సం॥ ఛాంపియన్ అయిన ఉస్మానియాతో పోటీచేసింది. మొదటి గంటలో ఎవ్వరు గోలు చేయలేదు. అదనపు వ్యవధిని ఇచ్చారు. మొదటి ఉస్మానియా ఒకగోలు చేసింది. కాని ఆ వ్యవధి పూర్తికాకముందే చీకటిపడిపోయినందువల్ల ఫలితం తేలకుండా పోయింది. పోటీ రేపు ఉదయం మళ్లీ జరుగుతుంది.

ఆట మొదటినుంచి చివరి వరకూ ఉస్మానియా జట్టు పై చేయిగా కనున్నది. బంతి ఎప్పుడూ ఉత్కళ్ గోలు దగ్గరే ఆడింది. కాని ఉస్మానియా ఫార్వర్డులు గోలుచేసే అవకాశాన్ని దేనినీ ఉపయోగించుకోలేదు. చివరకు అదనపు వ్యవధిలో రైట్ ఇన్ మొయినుద్దీన్ ఒక గోలు చేశాడు. ...

## ఆంధ్ర - మద్రాస్ పోటీ

## ఉభయజర్మనీల సంప్రదింపులు

### ఐక్యతకు అవసరమని గ్రోటెవోల్ ప్రకటన

## దక్షిణ రైల్వే

### టెండరు నోటీసు

# సారాతో సైకలు వదిలింది

## బందరు విద్యార్థికి

బందరు, సెప్టెంబరు 24: మోటారు ట్యూబులోను, వేరొకట్ల రబ్బరు సంచీలోనూ సారా పోసుకొని, సైకిలుమీద తెస్తుండగా సారంగం సత్యనారాయణ అనే విద్యార్థిని, ఇనుగురు పేట పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు ఎ. వి. సుబ్బయ్యగారు, పట్టుకొని కేసు పెట్టారు. సబ్ మేజిస్ట్రేటు యం. వి. రాఘవయ్యగారు, విచారించి, ముద్దాయికి రు. 50 జరిమానా విధించి, సారా తెచ్చిన ర్యాలీ సైకిల్‌ను ప్రభుత్వానికి దఖలు పర్చవలసిందిగా తీర్పు చెప్పారు.



# పరాగ్వేకు పెరాన్ ప్రయాణం

## అర్జెంటీనా కొత్త ప్రభుత్వం

### అమెరికా, బ్రిటన్‌ల పరిగణన

బ్యూనోస్ ఎయిర్స్, సెప్టెంబరు 25: అర్జెంటీనాలో కొత్తగా ఏర్పడ్డ జనరల్ లోనార్డి ప్రభుత్వాన్ని గుర్తించటానికి బ్రిటను, అమెరికాలు నేడు నిశ్చయించినవి. బ్రిటన్ నిర్ణయాన్ని లండనులో బ్రిటిషు విదేశాంగ కార్యాలయోద్యోగి ఒకరు వెల్లడించారు. అమెరికా నిశ్చయాన్ని డెన్వర్‌లో అమెరికా అధ్యక్షు కార్యాలయ ప్రచురణోద్యోగి వెల్లడించారు.

బ్రిటన్, అమెరికాలతో కలిపి మొత్తం 12 దేశాలు లోనార్డి ప్రభుత్వాన్ని గుర్తించినవి. అవి ఇవి. యురుగ్వే, ఛిలీ, పెరూ, స్పెయిన్, వాటికన్, బ్రాజిల్, ఇటలీ, స్విట్జర్లాండ్, ఈక్వడార్, వెనిజులా.

బ్యూనోస్ ఎయిర్స్ రేవులో ఆర్జెంటీనా వామాజీ అధ్యక్షుడు పెరాన్ దాక్కుని ఉన్న పరాగ్వే దేశపు గన్ బోటు నేడు స్వదేశానికి బయలుదేరింది. అయితే పెరాన్ అందులో ఉన్నాడో, దాని దగ్గర ఉన్న మరొక పరాగ్వే పడవలోకి ఎక్కాడో మాత్రం తెలియదు. ఇన్నాళ్లూ పెరాన్ పరాగ్వే పడవలో ఇంచుమించు ఖైదీగా ఉన్నట్లు తెలుస్తున్నది.

## దేశంలో మామూలు పరిస్థితి

ఆర్జెంటీనాలో మామూలు పరిస్థితులు క్రమంగా ఏర్పడుతున్నవి. రాష్ట్రాధికారుల నియామకం మామూలుగా జరుగుతున్నది. రొజారియో ప్రాంతంలో పెరాన్ అభిమానులు లేవదీసిన కల్లోలాలు సద్దుమణిగినవి.

# పంచభాషా కవిసమ్మేళనం

## హైద్రాబాదు హిందీ ప్రేమీ మండలిలో

హైద్రాబాదు, సెప్టెంబరు 25. క్రితం ఆదివారం సాయంత్రం హైదరాబాదు హిందీ ప్రచారసంఘ కార్యాలయంలో కవితాగోష్ఠి జరిగినది. జేపీసింగ్ చౌహాన్, అధ్యక్షత వహించారు. మండలి కార్యదర్శి శ్రీ మధుసూదన చతుర్వేదీ సభికులకు స్వాగతమిచ్చారు. శ్రీ ఆర్. ఎం. జోషీ గత సంవత్సరం హిందీ ప్రేమీ మండలి నడిపిన కార్యక్రమములను వివరీకరించారు.

హిందీ ప్రాచీన, ఆధునిక కవితల్లో మధుసూదన చతుర్వేదీ, పి. నారాయణ గారలు తెలుగు ప్రాచీన ఆధునిక కవిత్వాలను గురించి ఎస్. సి. వెంకటాచారి, రాఘవాచార్యులుగారలు మరాఠీ ప్రాచీన, ఆధునిక కవిత్వాలలో ఆర్. ఎం. జోషీ, ఎస్. ఎల్. బోరాంకర్ గారలు కన్నడ సాహిత్యంలో నేపియ్య పురాణిక్, కులకర్ణి గారలు ఉర్దూలో సయ్యద్ హమీద్ కుద్రీ, హమీదుద్దీన్ షాహిద్ గారలు కవితాగానం చేశారు.

తరువాత హైదరాబాదు హిందీ ప్రచారసంఘ కార్యదర్శి శ్రీ వేమూరి ఆంజనేయశర్మ వివిధభాషల సమన్వయానికి హిందీ ప్రచారసంఘం ఏవిధంగా పాటుపడుతున్నదీ వివరిస్తూ వివిధ భాషలకు సంబంధించిన, ముఖ్యంగా రాష్ట్రంలోని తెలుగు, కన్నడం, మరాఠీ, హిందీ, ఉర్దూ భాషలలోని వివిధ యుగాలకు సంబంధించిన సాహిత్యాన్ని వివరించే గ్రంథాలను పై అయిదుభాషలలోనూ ప్రచురించడానికి కృషిచేస్తున్నదనీ హిందీభాషలో పై భాషలకు సంబంధించిన ప్రారంభిక యుగము, 'పూర్వ మధ్యయుగము' అనే రెండు పుస్తకాలు ముద్రించబడ్డాయనీ వి.గిరీశయ్యగారికి సంబంధించిన పుస్తకాన్ని కూడా ప్రచురించడానికి కృషి చేస్తున్నదనీ చెప్పారు. ఈ ప్రయత్నంలో విభిన్న భాషా సాహిత్యవేత్తల సహకారం లభిస్తుందని ఆశిస్తున్నామన్నారు.

శ్రీ రామకృష్ణధూత్ సాహిత్య గోష్ఠులద్వారాను, ఇతర కార్యక్రమాల ద్వారాను హిందీ ప్రచారసంఘం జరిపే కృషిని ప్రశంసించారు. మండలి కార్యదర్శి శ్రీ హమీదుద్దీన్ షాహిద్ వందన లర్పించారు. ముగిసింది.

# దామోదర్ లోయ

## నీటి వసర్లు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 26: దామోదర్ లోయ ప్రాజెక్టుల మొదటి దశ నిర్మాణం పూర్తి అయ్యేప్పటికి ఏడాదికి 20 లక్షల ఎకరాలకు సప్లయి అవుతుంది.

మొత్తం ప్రాజెక్టు మూలంగా నదిలో మామూలుగా ప్రవహించే నీటిలో 4 వ వంతు కాలువలలోకి వస్తుందని ఉపమంత్రి వివరించారు.

న్యూఢిల్లీ, సెప్టెంబరు 26: అమెరికా శాస్త్రజ్ఞులు సాంకేతిక సహకార కార్యక్రమం క్రింద అమెరికా భారతదేశానికి పంపించవలసిన 6800 గుర్ఱ్ఱ వాగన్లలో 550 ఈమధ్యవచ్చాయి.

# పరపతి సంఘాలకు ఋణాలు

## సహకారమంత్రి ప్రకటన

కర్నూలు, సెప్టెంబరు 26: వాయిదాల్లో తిరిగి చెల్లించే పద్ధతిపై గ్రామీణ సహకార పరపతి సంఘాలకు ఋణాలు ఇవ్వాలన్న ప్రతిపాదన ఒకటి ఆలోచనలో ఉన్నదని సహకారమంత్రి శ్రీ సంజీవయ్య శ్రీ పి. వెంకటేశ్వర్లు ప్రశ్నలకు బదులు చెప్పారు.

అనుబంధ ప్రశ్నలకు జవాబు చెబుతూ, రైతులకు అప్పులుగా ఇచ్చిన సొమ్ము మొత్తం రు. 60 లక్షలని తెలిపారు.

వెనుకబడ్డ ప్రాంతాలలో గ్రామీణ పరపతి బ్యాంకులు నెలకొల్పే సందర్భాలలో, వాటాధనం సగానికి సగం ఉండితీరాలని పట్టుపట్టకుండా, మారింటపాటిక ముప్పైపాళ్లున్నా అంగీకరించవలసిందని సహకార సంఘాల రిజిస్ట్రార్ కు తాము ఉత్తర్వులు ఇచ్చారని కూడా అయన చెప్పారు.

# గుంటూరులో ఇళ్లకు పంపులు

## విరాళంగా ఇవ్వాల్సిన మొత్తం తగ్గింపు

గుంటూరు, సెప్టెంబర్ 23: గుంటూరు పురపాలక సంఘం శ్రీ తూను గుంట్ల వెంకట్రావు అధ్యక్షతన సమావేశమై నీటిపంపులు ఇండ్లకు యివ్వడంలో యిదివరలో విధించిన విరాళాన్ని రూ. 500 నుంచి తగ్గించి రూ. 250 మాత్రమే వసూలుచేయాలని నిర్ణయించారు. ఇదివరలో ఇట్లా విరాళంగా వసూలు అయిన మొత్తం రూ. 75 వేలు.

కనీసం మరి 150 కొళాయిలు యిళ్లకు యివ్వడానికి అంగీకరించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

# రాజమండ్రిప్రాంత రహదార్ల సిబ్బంది సంఘం

రాజమండ్రి, సెప్టెంబర్ 23: రాజమండ్రి ప్రాంత రహదారిశాఖ ఉద్యోగులసంఘం నిర్మాణంనిమిత్తం యీ క్రిందివారితో వొక ఉపసంఘం యేర్పాటు అయింది: జె. ఎస్. శర్మ, బి. శేషగిరిరావు, సి. హెచ్. గంగరాజు, వి. సూర్యనారాయణ, ఎ. ఉమాపతిరావు, వి. రామభద్రరావు, బి. పురుషోత్తం, ఎ. ఎస్. రామారావు, బి. పద్దాలు, ఎం. నారాయణ రాజు, వీర్రాజు, ఆర్. సత్యనారాయణ, పి. బి. శేషగిరిరావు, టి. ఎస్. చలపతి, ఇ. ఎస్. ప్రకాశరావు, ఎస్. యం. షరీఫ్ గారలు. (స్వ. వి.)

# కళింగపట్టణం హిందీ ప్రేమీమండలి

కళింగపట్నం, సెప్టెంబరు 24: కె. బి. హైస్కూలు భవనమున పట్టణ భాషాభిమానులు ప్రధానోపాధ్యాయులు శ్రీ కన్నెపల్లి కృష్ణారావుగారి అధ్యక్షతన సమావేశమై హిందీ ప్రేమీమండలిని నెలకొల్పి అధ్యక్షులుగ మజ్జి ధర్మారావు గారిని, ఉపాధ్యక్షులుగ మహేంద్రాడ వెంకటరామ నృసింహాచార్యులను, కార్యదర్శిగ డా॥ యం. అప్పారావుగారిని, సహాయకార్యదర్శిగ అంబారుఖాన్ పరసింహామూర్తిగారిని, సభ్యులుగ కప్పగంతుల సుబ్బారావుగారిని మరి ఏడుగురుని ఎన్నుకొన్నారు. హిందీ ప్రచారఅర్థనై జక్కిచిట్టూరి లక్ష్మీనారాయణశర్మ భారతీయ భాషలు వాటి ఐక్యతనుగూర్చి ఉపన్యసిస్తూ హిందీ నేర్చుకోవాలని సలహా యిచ్చారు. కూర్మాచార్యులుగారి అభివందనములతో సమావేశము ముగిసినది.

# రాష్ట్ర వార్తలు

## గుంటూరు

హిందీ విద్వాంసుడు, ఆంధ్ర సంస్కృత కార్యదర్శి అయిన శ్రీ వారణాసి రామమూర్తి (రేణు) గారు హైదరాబాదు రేడియో కేంద్రంలో ఉద్యోగం అయిన సందర్భంలో స్థానికులు సభ జరిపి వీడ్కోలు చెప్పారు. సభకు ఆచార్య దివ్వెల అప్పారావుగారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు ఏకా ఆంజనేయులు వెంపటి కాళేశ్వరరావు, శ్రీ రాగం ఆంజనేయులు, జమ్ములమడక మాధవరామశర్మ మొదలగువారు మాట్లాడారు. కుమారి జానకి, కుమారి హేమలత గానసభ జరిగింది.

## కాళహస్తి

ఆంధ్ర రాష్ట్ర అభివృద్ధి వ్యవహారాల కమిషనర్ శ్రీ ఎస్. చక్రవర్తి ఈ నెల 20 తే యిక్కడకు వచ్చి, జాతీయాభివృద్ధి కార్యక్రమ కేంద్రాన్ని సందర్శించారు. శ్యామాస్త్రి డిప్యూటీ కలెక్టరు మొదలగుఅధికారులు ఆయనవెంట వచ్చారు.

## తెనాలి

ఆంధ్రబ్యాంకు ఏజెంటు శ్రీ ఆర్. శేషగిరిరావుపాయుడు ఇక్కడ నుండి బదిలీ అయిన సందర్భంలో కమిషన్ వర్తకుల సంఘం 22 వ తేదీన ఆయన గౌరవార్థం విందుచేసి వీడ్కోలు చెప్పారు. (స్వ. వి.)

## పొన్నూరు

పట్టణ..సంఘం ఈ నెల 18 వ శ్రీ టి. కోటేశ్వరరావు అధ్యక్షతన సమావేశమై శ్రీ సండిరాజు శ్రీ హరిరావుగ అధ్యక్షులుగాను, శ్రీ ఎం. ... వయ్యను కార్యదర్శిగాను, శ్రీ ... డం రామసుబ్బారావును కోశాధికారిగాను ఎన్నుకున్నారు.

# చెరుకు రైతులకు చక్కెర మిల్లులు ఇస్తామన్న ధరలు

## ఇంతవరకూ ఇవ్వడం లేదు

కర్నూలు, సెప్టెంబరు 27: చెరుకు రైతులకు ఇచ్చే ధరల విషయమై మిల్లుల యజమానులు తయారుచేసుకున్న "సీస్మా" సూత్రం అమలు గురించి చర్చించే నిమిత్తం చెరుకు రైతుల మిల్లు యజమానుల సమావేశాన్ని తాము ఏర్పాటు చేయదలచుకొన్నట్లు ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి శాసనసభలో ప్రకటించారు.

ఈ "సీస్మా" సూత్రాన్ని దక్షిణాది పంచదార మిల్లుల సంఘం తయారు చేశారు. పంచదార ధరను చెరుకు పాకం దిగుబడిని బట్టి చెరుకు ధరను నిర్ణయించాలని "సీస్మా" సూత్రలక్ష్యం.

ఈ సూత్రాన్ని ప్రభుత్వమే అమలు చేయ వీలులేదు.

శ్రీ వేమయ్య ప్రశ్నకు సమాధానం ఇస్తూ ముఖ్యమంత్రి, చట్టరీత్యా ఈసూత్రాన్ని ఆమోదించడం జరగలేదు కాబట్టి ప్రభుత్వమే అమలుపరచ వీలు లేదు అన్నారు.

సీస్మా సూత్రాన్ని చట్టబద్ధం చేయరాదా అని ఒకసభ్యుడు సూచించగా, ఆ విషయమై ప్రభుత్వం ఆలోచించగలదని శ్రీ గోపాలరెడ్డి హామీ ఇచ్చారు.

## రూ 15 లక్షలు ఇవ్వదేలారు

చెరుకు రైతులకు మిల్లుల యజమానులు ఈ పద్ధతిని అనుసరించి ధరఇస్తే, ఎంత మొత్తాన్ని అధికంగా చెల్లించవలసివుండేదో వివరించే నివేదికను ప్రభుత్వం శాసనసభకు సమర్పించారు. 1953-54 లెక్కల ప్రకారం ఈ "సీస్మా" పద్ధతిని అనుసరించి మిల్లులు రైతులకు 15 లక్షల రూపాయలు చెల్లించవలసివుంది.

శ్రీ బి. అప్పారావు. ఆంధ్రరాష్ట్రం వచ్చిన తర్వాత పంచదార సెస్సు క్రింద ఎంత వసూలైనది?

ముఖ్యమంత్రి: 10 లక్షల రూపాయలు పైచిలుకు వసూలయింది. దీన్ని చెరుకు పరిశోధనకు, అభివృద్ధికి, చెరుకు పంట పోటీలకు, పంచదార మిల్లుల చట్టం పరిపాలనకు ఖర్చు పెడతారు.

ఒక సభ్యుడు ఈ సెస్సును టన్ను 1 కి 1-0-0 నుండి, 2-0-0 కు పెంచరాదా అని అడిగారు. ముఖ్యమంత్రి ఆలోచిస్తామన్నారు.

శ్రీ వేమయ్య, శ్రీ వి. విశ్వేశ్వరరావు "సీస్మా" పద్ధతిక్రింద రైతులకు రావలసిన బోనస్‌ను మిల్లులచేత ఇప్పించరాదా అని ప్రశ్నించగా, అలా ఇప్పించేటందుకు ప్రభుత్వానికి అధికారం ఏమీలేదని, అయినా తాను తిపనైతిక బలాన్నంతా ఉపయోగించి, అందుకోసం ప్రయత్నించేస్తానని ముఖ్యమంత్రి హామీ ఇచ్చారు. (ఈబోనస్సే పైన రైతులకు ఇవ్వవలసి ఉన్నదన్న 15 లక్షల రూపాయలు.)

## స్త్రీ వైద్యులను పల్లెలకు పంపండి

రాష్ట్రంలో 289 ప్రసూతి కేంద్రాలున్నాయని ప్రణాళికాశాఖ మంత్రి, తెలియజేశారు.

శ్రీ సందా నారాయణప్ప: "స్త్రీ వైద్యులు లేని ఆస్పత్రులు చాలా వున్నాయిగదా?"

సమాధానం: "18 చోట్ల లేరు. స్త్రీ వైద్యులను పల్లెటూళ్లకు వెళ్లమని గౌరవ సభ్యులు చెపితే నేను సంతోషిస్తాను. నేను గుంటూరులో ఆదేసంగతి చెప్పాను.

శ్రీ లుకలాపు లక్ష్మణదాసు: రెండేళ్లు విధిగా గ్రామాల్లో పనిచేయాలన్న నిబంధన పెట్టకూడదా?"

సమాధానం: "వాళ్లా పని చేయకపోతే మేము ఆ నిబంధన పెట్టాల్సి వస్తుంది."

శ్రీ కృష్ణావతారం: "119 జిల్లా బోర్డు మాతా శిశు సంరక్షణ కేంద్రాలు సరిగా పనిచేయనందున మంత్రి సరిగా పర్యవేక్షణ జరిపిస్తారా?"

సమాధానం: "కావలిస్తే మంత్రిసానులపై పర్యవేక్షణ అధికారంగాడ సభ్యులకు అప్పగిస్తా."

శ్రీ వేదూరి వాసుదేవరావు:— "అయితే నర్సులపైన స్త్రీ వైద్యులపైన పర్యవేక్షణాధికారం మంత్రులే పరిమితం చేసుకోదలిచారా?"

సమాధానం: "లేదు. కావాలంటే మీదాకా విస్తృతం చేస్తాం."

శ్రీ యన్. సి. శేషాద్రి: ఈ మాతా శిశు సంరక్షణకేంద్రంలో మగ వైద్యులు ఎందరుంటారు? మగ వైద్యులు ఉన్నవి ఎన్ని?"

సమాధానం: "ఇంగులో ఆడవారు మంత్రిసానులుగా మాత్రమే వుంటారు."

## ప్రణాళికా ప్రచారం

పంచవర్ష ప్రణాళికలను ప్రచారం చేయడంకోసమూ, ప్రభుత్వ కార్యకలాపాలను ప్రజలకు వివరించి చెప్పడంకోసమూ ప్రచారకకటాల ఉపయోగాన్ని ప్రారంభించడానికి సంకల్పించినట్లు సహకారమంత్రి తెలియజేశారు.

ఇందుకోసం ప్రణాళికలశాఖ, సమాచారశాఖ కలిసి 50 కళలకు కొనదలచుకున్నారని, ప్రస్తుతం రాష్ట్రంలో ... జిల్లాల మాత్రమే వున్నాయని కూడా ఆయన తెలియజేశారు.

"ప్రచారంకల్ల లాభాలువున్నాయి. ..."

(ప్రచారం జోరుగా సాగడంవల్ల తాగడం మానేశారు" అన్నారు.)

# తాటిబెల్లం పరిశ్రమ

## చక్కెరఉత్పత్తికవిల్లు

కర్నూలు, సెప్టెంబరు 26: తాటిబెల్లాన్ని పంచదారగా మార్చడానికి వార్తారకం యంత్రాలు బాగా ఉపయోగపడతాయని విశదమయితే, వాటిని రాష్ట్రంలో వాడకం చేయించే విషయం ప్రభుత్వం ఆలోచిస్తుందని ఈ వేళ శాసనసభా ప్రశ్నోత్తరాల సమయంలో మద్యనిషేధశాఖ మంత్రి చెప్పారు.

రాష్ట్రంలోని తాడి గీతపనివారల సహకార సంఘాలు 1953-54 లో 3,41,081 మణుగుల తాటిబెల్లం తయారుచేసినవనీ, 2,92,901 మణుగుల తాటిబెల్లం అమ్మినందున ఆయేడు రూ. 9,38,600 వచ్చినవనీ స్వర్ణ వేమయ్యగారి ప్రశ్నకు జవాబుగా మంత్రి వివరించారు.

శ్రీ పి. సుందరయ్య:- "తాటిబెల్లం నుంచి ఎంత సారా తయారుచేశారు.

జవాబు: అది లెఖ్ఖల్లో లేదండీ.

శ్రీ పి. కోదండరామయ్య: తాటిబెల్లనుంచి పంచదార తయారుచేయిస్తారా?

జ:- "సాధ్యమైతే చేయిస్తారు."

## ఉప్పు పరిశ్రమ

రాష్ట్రంలో ఉప్పు పరిశ్రమను ఏర్పాటుచేసే ఉద్దేశం ప్రభుత్వానికి లేదని స్వర్ణ వేమయ్య గారడిగిన ప్రశ్నకు జవాబుగా పరిశ్రమల శాఖ మంత్రి చెప్పారు.

ఉప్పు ఈరాష్ట్రంనుంచి ఇతరప్రాంతాలకు ఎగుమతి అవుతున్నది. కనుక ఇప్పుడు ఆ పరిశ్రమను ఏర్పాటుచేయవలసిన అవసరం లేదని ఈ సందర్భంలో వచ్చిన ప్రశ్నలకు మంత్రి సమాధానమిచ్చారు.

సోడా ఆష్ పరిశ్రమను ఏర్పాటు చేయించే విషయం ప్రశ్నించగా సొపడాలో అపరిశ్రమకు ఎక్కువ అవకాశాలున్నవనీ అక్కడ దానిని ఏర్పాటుచేయవలసిందిగా ప్రభుత్వేతర సంస్థలను కోరగా ఎవరూ ముందుకు రాలేదనీ మంత్రి అన్నారు.

సున్నపు గుల్ల పరిశ్రమను ఏర్పాటు చేసే సంకల్పంకూడా ప్రభుత్వానికి లేదనీ ప్రైవేటు వ్యక్తులెవరైనా పరిశ్రమ నెలకొల్పు తామంటే ప్రభుత్వం సహాయం చేస్తారనీ మంత్రి వివరించారు.

# నరోదంకు ప్రధాని పదవి

పారిస్, సెప్టెంబర్ 26: ఇటీవల కాంబోడియా ఎన్నికల్లో సంపూర్ణ విజయం సాధించిన మాజీ రాజు నరోదంను రెండేళ్లు ప్రధానిగా ఉండవలసిందని ప్రస్తుతరాజు సురమరిత్ ఒత్తిడి చేస్తున్నారు.

నిన్న ఈ ప్రతిపాదనకు నరోదం అంగీకరించారు కాని, ఈవేళ మనసు మార్చుకుని మరి ముగ్గురి పేర్లు సూచించారు.

# కొల్లేటి భూములు

## జిల్లా వెనుకబడిన జాతుల అభ్యర్థన

ఏలూరు, సెప్టెంబరు 25: పశ్చిమ గోదావరిజిల్లా వెనుకబడినజాతుల సంఘ కార్యవర్గం యీ వారారంభంలో ఏలూరులోని సంఘ కార్యాలయముందు గరిగె వెంకటరత్నంగారి అధ్యక్షతన సమావేశమై ఏలూరు వెనుకబడినజాతుల వ్యవసాయదారులకు కొల్లేటిభూములు సాగు చేసుకోవడానికి యివ్వవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

ప్రతి సభ్యుడు కొల్లేటిభూములు సాగు చేసుకోవడానికి అవసరమైన పంపుసెట్టులు వగైరాల నిమిత్తం తలా 50/- పెట్టుబడిక్రింద యివ్వడానికి తీర్మానించారు.

ఈ దిగువవారిని ఏలూరు వెనుకబడిన జాతుల వ్యవసాయదార్ల సంఘ కార్యవర్గంగా ఎన్నుకొన్నారు. అధ్యక్షుడు: గొల్ల సింహాద్రి ఉపాధ్యక్షులు మండా రాములు కోశాధికారి ఆదివిష్ణు నాగేశ్వరరావు, సహాయ కార్యదర్శి గరికపల్లి పాతురాజు, సభ్యులు వదారి సత్యనారాయణ, గరిగె వెంకటరత్నం, ఉరిటి రామయ్య కిరిగిబత్తిన రామయ్య, గొల్ల రామన్న, పిరికెట్టి లక్ష్మీనారాయణ, రపపుత్రి నాగభూషణం, గరవపత్యం, తాతా సూర్యనారాయణ, వైకుంఠం అప్పారావుగారలు.

# హోసపేటలో పిల్లలకు పాలసప్లయ్

హోసపేట, సెప్టెంబరు 24: ఇచ్చటి ప్రసూతినిలయంలో 20 వ తేదీ నుంచి పసిపిల్లలకు ఉచితముగా పాలు యిచ్చే యేర్పాటుచేశారు. పురపాలసంఘాధ్యక్షుడు మదారి వెంకటస్వామి గారు ప్రారంభోత్సవం జరిపారు.

# ఎంట్రీల సంఖ్య 2 వేలుమాత్రమే

## పజిల్స్ బిల్లుకు లోక్‌సభ ఆమోదం

### గరిష్ఠ బహుమతి వెయ్యిరూపాయలే

న్యూఢిల్లీ, సెప్టెంబరు 26: నెలకు బహుమతుల మొత్తం వెయ్యిరూపాయలకు మించే పజిల్ పోటీలను లోక్ సభ నేడు నిషేధించింది. ప్రతిపోటీకి 2 వేలకు మించి ఎంట్రీలను స్వీకరించరాదని కూడా లోక్ సభ నిర్దేశించింది.

పజిల్ పోటీల కంట్రోలు బిల్లును లోక్ సభ నేడు ఆమోదిస్తూ ఎంట్రీల సంఖ్యను పరిమితం చేసే ప్రధాన సవరణను ఆమోదించింది. ఈ సవరణతో ఇంక పజిల్సు మాతమారినట్లే అని లాబీ వర్గాలు అంటున్నారు. ఈ సవరణను కాంగ్రెసు సభ్యుడు శ్రీ ఎం. డి. జోషీ ప్రతిపాదించారు.

భారతీయ పజిల్సు నిర్వాహకులు తమ కార్యాలయాన్ని మరొక దేశంలో నెలకొల్పి ఈబిల్లు నియమాలను తప్పించుకునేందుకు వీలులేకుండా నిషేధించే మరొక ప్రధానమయిన సవరణ కాంగ్రెస్ సభ్యుడు శ్రీ టి. ఎన్. సింగ్ ప్రతిపాదించారు. దానినికూడ లోక్ సభ ఆమోదించింది.

నియమాలను ఉల్లంఘించేవారికి జరిమానా మాత్రమే మొదట్లో ప్రతిపాదించబడ్డది. ఇప్పుడు జైలుశిక్ష విధించే అవకాశంకూడా ఇవ్వబడ్డది. బిల్లును అన్నిపక్షాల సభ్యులూ సమర్థించారు. వారన్నదల్లా ఒక్కటే - ఈ నిర్బంధ నిషేధాలు కూడా ఈ దురాచారాన్ని అరికట్టటానికి చాలవని.

బిల్లు ప్రతిపాదించేనాటికి ఆంధ్ర మొదలైన రాష్ట్రాలకు వర్తించేట్లు చెప్పబడ్డది. ప్రతిపాదనకు తరవాత ఇటువంటి శాసనాన్ని కేంద్రం చేయటానికి రాష్ట్ర శాసనసభలు ఆమోదించిన కొన్ని ఇతర రాష్ట్రాలకుకూడా ఇది వర్తింపజేయబడ్డది.

బిల్లును సమర్థిస్తూ దేశీయాంగమంత్రి పంత్ ఈ విధంగా అన్నారు:

"ఈ పజిల్ పోటీలు లాటరీలకన్నా ఏమీ భిన్నంగాలేవు. వీటిలో ఒక్కొక్కదానికి అయిదు, ఆరు, ఏడు, ఇంకా ఎక్కువ సమాధానాలు కూడా ఉంటవి. పోటీల నిర్వాహకులు తమ ఇష్టంవచ్చిన సమాధానాన్ని సరయినదిగా నిర్ణయిస్తారు. ఒక్కొక్క వ్యక్తి ఎన్ని ఎంట్రీలనయినా పంపుకోవచ్చును, ఒకటయినా సరిగా ఉంటుందేమోనన్న ఆశతో పంపిస్తారు. దీనికీ లాటరీకీ తేడా ఏమిటి? ఈబిల్లు పూర్తిగా పజిల్సును నిషేధించటం లేదు. పజిల్సును విడదీయటంలో ఆసక్తి గలవాళ్లకు హాని కలక్కుండా ఉండే పద్ధతిలో వాటిని నడపటానికి అవకాశం ఉన్నది "అని పంత్ వివరించారు.

దేశంలో యావన్మందీ దీనికి హర్షించారనీ, ఒక్కరు కూడా ప్రతిఘటించలేదని ఆయన అన్నారు.

## చర్చకు ఆక్షేపణ

మద్రాస్ స్వతంత్ర సభ్యుడు డా॥ ఎ. కృష్ణస్వామి గారు బిల్లుమీద ఇప్పుడు చర్చ జరపరాదని అభ్యంతరం చెప్పారు. ఈ బిల్లు రాష్ట్రాలు తమ శాసనాధికారాలను కేంద్రానికి అప్పగించే సూత్రం మీద (రాజ్యాంగం 252 వ సూత్రం) ఆధారపడి ప్రతిపాదించ బడ్డదనీ, అట్లా శాసనాధికారాలను కేంద్రానికి అప్పగించే అధికారం రాష్ట్రాలకు ఉన్నదా లేదా అన్న విషయమై ఇప్పుడు బొంబాయి ప్రభుత్వం వేసిన దావాఒకటి సుప్రీంకోర్టు అపీలులో ఉన్నదనీ అందువల్ల కోర్టు నిర్ణయం వచ్చేవరకూ ఈబిల్లును చర్చించరాదనీఅన్నారు. దీనిని శ్రీ కె. ఎస్. రాఘవాచారి, శ్రీ ఎస్. ఎస్. మోరే ప్రభృతులు ప్రతిఘటించారు

చివరకు స్పీకర్ శ్రీ మవ్లాంకర్ ఈ ఆక్షేపణను త్రోసివేశారు.

## బహుమతుల జాబితాల్లో కూడా దగా

చర్చలో శ్రీ ఎన్. పి. సిన్హా పిలయివంతి త్వరలో అసలు పజిల్సును పూర్తిగా నిషేధించాలని అన్నారు. బహుమతులజాబితాలను ప్రకటించటంలోకూడా పజిల్సునిర్వాహకులు దగాచేస్తున్నారని ఆయన నిరసించారు. తన నియోజకవర్గం ఒక వ్యక్తికి ఒక పజిల్లో 60 వేల రూపాయలు వచ్చినట్లు ప్రకటించబడిందనీ, తీరా విచారిస్తే అతడికి 60 రూపాయలుకూడా రానట్లు తెలిసిందని ఆయన వెల్లడించారు.

శ్రీ ఎస్. వి. ఎల్. నరసింహం (ఆంధ్ర) మాట్లాడుతూ ఈ బిల్లు చాలదనీ, పజిల్సును పూర్తిగా నిషేధించాలనీ అన్నారు. పజిల్సు నడిపే లైసెన్సులను ఏ నియమాల ప్రకారం ఇస్తారో బిల్లులో చేర్చాలని అన్నారు.

శ్రీ ఫూల్‌సింగ్‌జీ దాభీ బహుమతుల గరిష్ఠపరిమాణాన్ని 500 రూపాయలకు తగ్గించాలనీ అన్నారు. ఒక్కొక్క వ్యక్తి పంపే ఎంట్రీలసంఖ్యకు పరిమితి నిర్ణయించాలని శ్రీ ఎం. డి. జోషీ ...

శ్రీ ... ఈ బిల్లును రాజ్యాంగంలో 248 వ సూత్రంక్రింద తీసుకోవాలని, అంటే కేంద్రాధికారాల కేంద్రానికేవున్న పద్ధతిమీద వ్యవహరించాలని కోరారు. బిల్లును రాష్ట్రాలన్నిటికీ వర్తింపచేయాలనీ, లేకపోతే బిల్లు వర్తించే రాష్ట్రాలనుంచి పజిల్సు నిర్వాహకులు ఇతర రాష్ట్రాలకుపోయి, అక్కడనుంచి నడిపే ప్రమాదం ఉంటుందని అన్నారు.

ప్రెస్‌కమిషన్ సభ్యుడయిన శ్రీ టి. ఎన్. సింగ్ మాట్లాడుతూ ఈబిల్లు విదేశాల్లో ముద్రించబడే పజిల్సు పత్రికలకుకూడా వర్తిస్తుందా అని ప్రశ్నించారు. శ్రీ గురుపాదస్వామి బహుమతి మొత్తాన్ని, ఎంట్రీల సంఖ్యను తగ్గించాలనీ, బిల్లును పరిశీలనసంఘానికి పంపాలనీ సూచించారు.

చర్చకు దేశీయాంగమంత్రి సమాధాన మిస్తూ మొదట బహుమతుల గరిష్ఠ పరిమితి నెలకు పదివేలవరకూ ఉండవచ్చునని ఉద్దేశించబడ్డదనీ, తరవాత అది వెయ్యిరూపాయలకు తగ్గించబడ్డదనీ తెలియజేశారు. ఈబిల్లువల్ల పజిల్సుని అరికట్టటం సాధ్యంకాకపోతే, ఇంకా కఠినమయిన సవరణలు చేయబడతవని అన్నారు.

బిల్లు దేశం అంతటికీ వర్తిస్తుందని పండిత పంత్ అన్నారు.

క్లాజువారీ చర్చలో పండిత పంత్ ఈ బిల్లును మద్రాసు, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్, హైద్రాబాద్, మధ్యభారత్ సౌరాష్ట్రాలకు వర్తింపజేస్తూ ప్రతిపాదించిన సవరణ ఆమోదించబడ్డది. మొదట్లో ఇది ఆంధ్ర, బొంబాయి, పెప్సూ రాష్ట్రాలకూ అన్ని 'సి'తరగతి రాష్ట్రాలకూ వర్తింపజేయటానికి ఉద్దేశించబడ్డది.

బహుమతి మొత్తాన్ని నెలకు 500 రూపాయలకూ, 200 రూపాయలకూ తగ్గించాలనీ సవరణలు ప్రతిపాదించబడ్డవి. కాని అవన్నీ నిరాకరించబడ్డవి. తప్పుడు లెక్కలు రాసినందుకు జైలుశిక్ష విధించాలన్న శ్రీ దాభీ సవరణ, 2 వేల ఎంట్రీలకు మించి ఏ పజిలు కూడా ఉండరాదని శ్రీ జోషీ సవరణ, లైసెన్సులకు రుసుము కట్టనక్కరలేదన్న శ్రీ యు. ఎం. త్రివేదీ సవరణ ఆమోదించబడ్డవి.

క్లాజులన్నీ ఏకగ్రీవంగా ఆమోదించారు.



# టెండర్ నోటీసు

## రామచంద్రపురం పంచాయితీ

ఈ పంచాయితీ తాలూకు యీ దిగువ రోడ్డు పనులకు సీలు వేయబడిన టెండరు యీ దిగువ సంతకము చేసినవారిచే 4-10-55 తేది సాయంత్రము 4 గంటలవరకు తీసుకొనబడును. ఇతర వివరములు ఆఫీసు పనిచేయు కాలములో తెలుసుకొనవచ్చును.

| | పని వివరము | ఎస్టిమేటు. | ధరావత్తు. |
|---|---|---|---|
| 1. | ఆళ్లవారి బజారునకు క్వారీ రబ్బిష్‌తో రోడ్డు వేయుట ... ... | రు. 950/- | రు. 47-8-0 |
| 2. | మల్లంపాటి వారి బజారునకు క్వారీ రబ్బిష్‌తో రోడ్డు వేయుట ... | రు. 1200/- | రు. 60-0-0 |
| 3. | వైశ్యుల బజారునకు క్వారీ రబ్బిష్‌తో రోడ్డు వేయుట ... ... | రు. 1100/- | రు. 55-0-0 |
| 4. | మాజీ ప్రెసిడెంటుగారి బజారునకు క్వారీ రబ్బిష్‌తో రోడ్డు వేయుట ... | రు. 800/- | రు. 40-0-0 |
| 5. | (1) పరకేసుగారి బజారునకును (2) సాలీల బజారునకును క్వారీ రబ్బిష్‌తో రోడ్డువేయుట ... | రు. 1350/- | రు. 67-8-0 |
| 6. | (1) తమ్మా పున్నారెడ్డిగారి బజారుకును (2) కుర్రె సుబ్బారెడ్డిగారి బజారుకును (3) గంగానమ్మ బజారునకును క్వారీ రబ్బిష్‌తో రోడ్డు వేయుట. | రు. 1600/- | రు. 80-0-0 |

కుర్రె వెంకట రెడ్డి, ప్రెసిడెంటు,
పంచాయితీ ఆఫీసు, రామచంద్రపురం, గుంటూరు తా॥ (గుంటూరు జిల్లా)

## గంటల పంచాంగం

శ్రీమన్మథసం॥నిజభా॥ద్రపద శు॥ద్వాదశి
1955- సం॥ సెప్టెంబరు 28 బుధవారం
శు॥ద్వాదశి రా 3-58కిని రా 5-30వర్జ్యం 8 44 ల 10-24 వ.
శు॥త్రయోదశి సెప్టెంబరు 29 గురువారం
శు॥ త్రయోదశి రా 8-29 శత రా 5-42
వర్జ్యం 12-46 ల 14-28 వ.


# ఆంధ్రపత్రిక

శ్రీ మన్మథ సం॥నిజభాద్ర॥శు॥ ద్వాదశి
బుధవారం


## అభివృద్ధి పన్ను

అవి సంఘ సంస్కరణలే కావచ్చును; ఆర్థిక ప్రతిపాదనలే కావచ్చును; ఏవి అయినా వాటిని గతించిన కాలానికి కూడా వర్తింపచేస్తూ శాసనాలు చేయడంవల్ల ఎన్నో క్రొత్త సమస్యలు ఉత్పన్నమౌతవి. కొంద...

...వ్యయ పరచ వలసి వస్తున్నది. ప్రభుత్వం నుంచి ఋణాలు తీసుకొని ఆ ఋణాలకు సంబంధించిన వాయిదాలను చెల్లిస్తూ, క్రొత్త అభివృద్ధి పన్నునుకూడా చెల్లించగల ఆర్థిక స్తోమతు రైతులకు వున్నదా అనే విషయాన్ని కూడా విచారించవలసివుంటుంది. నీటివసర్లు ఏర్పడినప్పటికీ అభివృద్ధి కాని భూములు, ధరలు హెచ్చని భూములు వుండవచ్చును. వాట్ని మినహాయించడాన్నికూడా ప్రభుత్వం విచారించవలసి వుంటుంది. రాష్ట్ర ప్రభుత్వం ప్రతిపాదించినబిల్లును అనేక విషయాల్లో సవరణచేస్తే గాని క్రొత్త ఆయకట్టుక్రిందవున్న రైతులందరికీ న్యాయం జరగదు. పన్నును వర్తింపచేసే కమతాలకు ఒక కనిష్ఠ పరిమితిని నిర్ణయించడం అవసరం. ఇల్లు అలకగానే పండుగ కానట్లు నీటివసర్లు ఏర్పడగానే భూములు అభివృద్ధి చెందవు. ప్రతి ప్రాజెక్టుక్రిందా ఒక్కొక ఎకరం అభివృద్ధికి ఎంత ఖర్చు అవుతుందో తెలుసుకోవడం ముఖ్యం. రైతుల స్వాయం కృషికి, కాయకష్టానికి విలువ కట్టకపోయినా, వారు భూములను సాగుకు అనువుగా చేయడానికి ఎంతడబ్బు వెచ్చించారో...

## భద్రతామండలిలో స్థానం

### ఎవ్వరూసూచించలేదని శ్రీ నెహ్రూ ప్రకటన

## ప్రభుత్వంచేసే వసతులు వల్ల లాభం పొందినవారు

### విరాళ మివ్వడం సమంజసమని రెవెన్యూ మంత్రి భావం

### కృష్ణా బరాజ్ ఉపయోగంలోకి వచ్చిన తర్వాతనే విరాళం వసూలు ప్రారంభం

కర్నూలు, సెప్టెంబరు 26: అభివృద్ధిపన్ను బిల్లుపై చర్చకు జవాబు చెబుతూ, రెవెన్యూమంత్రి, ఈబిల్లు ద్వారా వసూలుచేయదలచేది 'పన్ను' కాదనీ, ప్రభుత్వం కల్పించే నీటివసరులవల్ల లాభము పొందినవారివద్ద, కొంత మొత్తం వసూలుచేయడంలో జేఘబబు ఏమీ లేదు అని అన్నారు.

కృష్ణా బరాజ్‌క్రింద సాగయ్యే భూములు పదునుకు రావడానికి మూడేళ్లు పడుతుందనీ, అవి పంట ముఖం పట్టినప్పుడే పన్నువిధించడం జరుగుతుందనీ కూడా మంత్రి అన్నారు.

### 1947 నుంచీ వర్తు

### ప్రతిపక్షవాదన బోధపడదు

### రక్షణ ఖర్చు

### రూ 50 వేలకు పెంపు

### లాభం పొందేవారు ఇవ్వరాదా?

## అయిదు జిల్లాల్లో జనాభలెఖ్ఖలపరిశీలన

(1 వ పేజీ తరువాయి)

క్రమాలు జరిగినాయి కనక 1931 లెక్కలే ప్రాతిపదికగా చేసుకోవటము న్యాయమని ప్రభుత్వము గమనించినదా?

జవాబు: '5'-లెక్కలు అక్రమాలని '31'-లెక్కలు క్రమాలని మాకు తెలియదు.

### ఒరిస్సా ఎల్లలు

శ్రీ రామకృష్ణంరాజు: ఒరిస్సా సరిహద్దు గురించి కూడా ఆలోచిస్తారా?

జవాబు: ఆలోచిస్తాము.

శ్రీ పి. ఎస్. అప్పారావు: ఈ సరిహద్దులోపాటే ఉత్కళ సరిహద్దు విషయముకూడా తేలుస్తారా?

### అన్నీ ఒకసారికాదు

జవాబు: అన్నీ ఒకసారి ఎత్తుకొనటము మంచిదికాదు. ఒకటి అయినతరువాత ఒకటి తేల్చుకొందాము.

శ్రీ సుందరయ్య: చంద్రగిరి తాలూకా ద్విభాషా ప్రాంతము అన్నారు, ఎక్కడ వుందండీ అలా?

జవాబు: లెక్కలు తీసుకోవటంలో తప్పు యేమీ లేదు.

### ఏవో ఒక లెక్కలు అవసరం

### సూళ్లూరుపేట కూడానా!

### చిత్తూరు ద్విభాషా ప్రాంతమా

### ముఖ్యమంత్రికి తెలియదు

## ఈనాం భూములపై రైత్వారీ శిస్తు విధింపు

### పరిశీలనసంఘానికిబిల్లుసమర్పణ

కర్నూలు, సెప్టెంబరు 26: ఈనాం భూములపై రైత్వారీ శిస్తు విధించే బిల్లును పరిశీలక సంఘానికి పంపించే ప్రతిపాదనను నేటి సాయంకాలం సమావేశంలో ఆంధ్ర శాసనసభ ఆమోదించారు.

...ప్రమాదము సంభవిస్తుంది.

### ఒరిస్సా ఆంధ్రులకు అపచారాలు

శ్రీ తిమ్మినేని పాపారావు: ఒరిస్సా ఆంధ్రుల విషయములో చాలా అక్రమాలు జరుగుతున్నాయని ముఖ్యమంత్రికి తెలుసునా?

జవాబు: అలాంటివి వింటూ ఉంటాము.

ప్రశ్న: 1931 లెక్కలే ప్రాతిపదికగా చేసుకొంటారా?

జవాబు: ఆలోచిస్తాము.

### విపరీతమైన ఆరోపణ

ఈ బిల్లును పరిశీలించ వలసిందిగా సభను కోరుతూ గవర్నరు శ్రీ త్రివేదీ పంపిన సందేశాన్ని అంతకుముందు సభాపతి శ్రీ ఆర్. ఎల్. ఎన్. దొర సభలో చదివారు.

పరిశీలక సంఘానికి ఈ క్రింది సభ్యుల పేర్లను రెవిన్యూమంత్రి సూచించారు: శ్రీ కల్లూరి చంద్రమౌళి; ప్రణాళికల మంత్రి శ్రీ కళా వెంకట్రావు; శ్రీయుతులు రాజా కృష్ణంరాజా బహద్దూర్, గాదిరాజు జగన్నాథరాజు, విజయభాస్కర రెడ్డి, కె. సీతారామస్వామి, ఎమ్. వెంకటరాజు, పి. రాజగోపాల నాయుడు...

### 28 లక్షల ఎకరాలపై శిస్తు

### సినిమాలకు లైసెన్సులు

### నాటకాలు వేసేవా రేరీ?

### విడిచిన ప్రాంతాలను కలపడమే

### నచ్చజెప్పాలి

### రాజకీయ పక్షాలకు విరాళాలు

### వ్యాపార సంస్థలకు అవకాశం

### బందలాయి చెర్వులపై కమ్యూనిస్టుల దాడి

## సంపాదకునకు లేఖలు

### కొలమానాల ధృవీకరణ

ఆర్యా, తోడ్డు స్టాండింగు ఆర్డరు ప్రకారం 3 సంవత్సరములకు ఒకతూరి స్టాంపింగుమాస్టాలు, డిప్యూటీతహసీలుదారు ఆఫీసుదగ్గరకువచ్చి తూకపురాళ్లు, కొలతపాత్రలు, కొలతబద్దలు, హెచ్చు తగ్గులు సరిచేసి ముద్రలువేసి పురువు 1 కి రు. 0-1-0 చొప్పున వసూలు చేయవలసియున్నది. కాని ప్రస్తుతం స్టాంపింగు మాస్టాలు కొంతమంది పీకెంట్లను పెట్టుకొని పురువు 1 కి రు. 0-1-0 బదులు రు. 2-0-0 వరకు వసూలుచేయుచున్నారు. కాని రశీదులు మాత్రము రు 0-1-0 (ఒక అణా) కే యిచ్చుచున్నారు. వాస్తవముగా స్టాంపింగు మాస్టాలే యీ వ్యవహారము లన్నియు చూడవలసియున్నది. యిందులో యితరులెవ్వరూ జోక్యం కలిగించుకొనగూడదు. ప్రభుత్వం అనుమతిలేని అక్రమ వసూళ్లు చేయుచున్నారు...

### హోమియో వైద్యుల రిజిస్ట్రేషన్

### జిల్లాబోర్డుల ఎన్నికలు వెనుకబడిన జాతులు

